శ్రీరస్తు    శ్రీ మంగళగౌరీదేవ్యై నమః    శుభమస్తు

# మంగళగౌరీ వ్రతము

## పూజావిధానము - వ్రతకథ

## శ్రావణ మంగళవార, శుక్రవారపు పాటలతో






వసుంధర పబ్లికేషన్స్
విజయవాడ - 2



వెల రూ. 12/-

# శ్రీ గౌరీ నవరత్న మాలికా స్తవమ్

1. వాణీం జితశుకవాణీ మళికులవేణీం భవాంబుధిద్రోణీమ్,
వీణాశుకశిశుపాణిం నతగీర్వాణీం నమామి శర్వాణీమ్

2. కువలయదళనీలాంగీం కువలయరక్షైక దీక్షితాపాంగీమ్
లోచనవిజితకురంగీం మాతంగీం నౌమి శంకరార్ధాంగీమ్

3. కమలాం కమలజకాంతాం కలపారసదత్త కాంతకరకమలామ్,
కరయుగళవిధృతకమలాం విమలాంకమలాంకచూడసకలకలామ్

4. సుందరహిమకరవదనాం కుందసురదనాం ముకుందనిధిసదనామ్,
కరుణోజ్జీవితమదనాం సురకుశలాయాసురేషు కృతదమనామ్

5. అరుణాధరజితబింబాం జగదంబాం గమనవిజిత కాదంబామ్,
పాలితసుతజనకదంబాంపృథులనితంబాంభజేసహేరంబామ్

6. శరణాగతజనభరణాం కరుణావరుణాలయాబ్జ చరణామ్
మణిమయదివ్యాభరణాం చరణాంభోజాత సేవకోద్ధరణామ్

7. తుఙ్గస్తనజితకుంభాం కృతపరిరంభాం శివేన గుహడింభామ్
దారితశుంభనిశుంభాంనర్తితరంభాం పురోవిగతదంభామ్

8. నతజనరక్షాదీక్షాం దక్షాం ప్రత్యక్షదైవతాధ్యక్షామ్,
వాహీకృతర్యహ్యక్షాంక్షపితవిపక్షాంసురేషుకృతరక్షామ్

9. ధన్యాంసురవరమాన్యాంహిమగిరికన్యాంత్రిలోకమూర్ధన్యామ్
విహృతసురద్రుమవన్యాం వేద్మి వితాత్మాంన దేనతామన్యామ్

10. ఏతాం నవమణిమాలాం పఠంతి భక్త్యేహ యే పరాశక్త్యా
తేషాం వదనే సదనే నృత్యతి వాణీ రమా ...

# మంగళ గౌరీ వ్రతము

## ఆచమనమ్

ఓం కేశవాయ నమః, ఓం నారాయణాయ నమః, ఓం మాధవాయ నమః అని మూడు పర్యాయములు ఆచమనము చేయవలయును,
ఓం గోవిందాయ నమః అని చేతులు కడుగుకొనవలయును.
ఓం విష్ణవే నమః అని నేత్రములను తడిచేతితో తుడుచుకొనవలయును.

| | | |
|---|---|---|
| ఓం మధుసూదనాయ నమః | ఓం దామోదరాయ నమః | ఓం అదోక్షజాయ నమః |
| ఓం త్రివిక్రమాయ నమః | ఓం సంకర్షణాయ నమః | ఓం నారసింహాయ నమః |
| ఓం వామనాయ నమః | ఓం వాసుదేవాయ నమః | ఓం అచ్యుతాయ నమః |
| ఓం శ్రీధరాయ నమః | ఓం ప్రద్యుమ్నాయ నమః | ఓం జనార్ధనాయ నమః |
| ఓం హృషీకేశాయ నమః | ఓం అనిరుద్ధాయ నమః | ఓం ఉపేంద్రాయ నమః |
| ఓం పద్మనాభాయ నమః | ఓం పురుషోత్తమాయ నమః | ఓం హరయే నమః |
| | | ఓం శ్రీ కృష్ణాయ నమః. |

ఈ నామములను భక్తితో ఉచ్చరించుచూ సర్వ మంగళములను కలుగ జేయవలసినదని భగవానుడు శ్రీ మహావిష్ణువును ప్రార్థించవలెను.

## మంగళోచ్చారణమ్

శ్రీ మహాగణాధిపతయే నమః
శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః,
వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః,
శ్రీ ఉమామహేశ్వరాభ్యాం నమః
శచీపురందరాభ్యాం నమః,
అరుంధతీ వశిష్ఠాభ్యాం నమః,
కులదేవతాభ్యో నమః,
మాతాపితృచరణ కమలేభ్యో నమః,
పతిచరణారవిందాభ్యాం నమః
సర్వేభ్యోదేవేభ్యో బ్రాహ్మణేభ్యశ్చ నమః

నిర్విఘ్నమస్తు, పుణ్యాహం దీర్ఘమాయురస్తు,

శ్లో॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమిభారకాః
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే.

అని ఉదకమును తనకు చుట్టు చల్లవలయును. యం,రం,లం,వం అని స్మరించుచు, కుడిముక్కుతో వాయువును నెమ్మదిగా పీల్చి, ఎడమముక్కుతో విడువ వలయును. అట్లేఎడమముక్కుతో వాయువునుపీల్చి కుడిముక్కుతోవిడువవలయును.

# సంకల్పము

పంచాశత్కోటి విస్తీర్ణమహీమండలే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్యే ఈశాన్య దిగ్భాగే, కృష్ణాగోదావర్యోర్మధ్యప్రదేశే, శోభనగృహే, గోబ్రాహ్మణ హరిహరచరణసన్నిధౌ, శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్త మానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే, శ్వేతవరాహకల్పే వైవశ్వతమన్వంతరే అష్టావింశతితమే కలియుగే, ప్రథమపాదే, వర్తమాన వ్యవహారిక చంద్రామానేన... సంవత్సరే.... ఆయనే,.... ఋతౌ..... మాసే..... పక్షే.... తిథౌ..... వాసరే శుభ నక్షత్రే శుభయోగే శుభకరణే, ఏవంగుణ విశేషణవిశిష్టాయం శ్రీమాన్.... గోత్రస్య.... ధర్మపత్నీ శ్రీమతి.... గోత్రావతీ..... నామధేయవతీ, అహం మమోపాత్త దురితక్షయ ద్వారా యావజ్జీవసౌమంగళ్య సిద్ధ్యర్థం, పుత్రపౌత్ర సంపత్సౌభాగ్య సిద్ధ్యర్థం మమ వివాహ ప్రథమవర్షాదిపంచమవర్ష పర్యంతం శ్రీ మంగళగౌరీవ్రతం కరిష్యే. అద్య శ్రీమంగళ గౌరీదేవతా ముద్దిశ్య శ్రీమంగళగౌరీదేవతా ప్రీత్యర్థం సంభవద్భి ర్ద్రవ్యైః సంభవతా నియమేన ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే.

అని సంకల్పమొనర్చి నీటిని విడువవలయును.

# కలశపూజ

**తదంగ కలశారాధనం కరిష్యే, అభిమంత్రాయతే శుద్ధోదకైః ఆపూర్య, గంధపుష్పాక్షతైర భ్యర్చ్య.**

ఒక పాత్రయందు శుద్ధోదకములనుంచి గంధపుష్పగోరోచనకర్పూర కేసర్యాది ద్రవ్యములతో సువాసితములగునట్లొనర్చి యా కలశము నభిమంత్రించి అనంతరం కుడిచేతి వ్రేళ్ళతో కలశమందలి జలమును తాకుచూ ఈ క్రింది శ్లోకమును చదువవలెను.

**శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠేరుద్ర స్సమాశ్రితః**
**మూలే తత్ర స్థితో బ్రహ్మామధ్యే మాతృగణాశ్రితాః**
**కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా**
**ఋగ్వేధో౽థ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః**
**అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః**
**గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి**
**నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు.**
**ఆయాంతు శ్రీ మంగళగౌరీ పూజార్థం మమ దురితక్షయ కారకాః**
**కలశోదకేన పూజాద్రవ్యాణి దేవీ మాత్మానం చ సంప్రోక్ష్య**

అని కలశములోని ఉదకముతో పూజాద్రవ్యములపైన తన శిరస్సుపైన చల్లుకుని స్వర్ణముతోగాని, పసుపుతోగాని, చేసి సిద్ధపరచబడిన గౌరీదేవిపైన జల్లవలయును.

## ప్రాణప్రతిష్ఠ

ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం క్షం హం సః శ్రీ మంగళ గౌరీ దేవతా స్థిరాభవతు, సుప్రసన్నాభవతు, వరదా భవతు

అని గౌరీ దేవతా ప్రతిష్ఠాపనము చేయవలయును.

## దీప దేవతాభ్యో నమః

శ్లో॥ దీప స్త్వం బ్రహ్మరూపోఽసి జ్యోతిషాం ప్రభురవ్యయః,
సౌభాగ్యం దేహి పుత్రాంశ్చ సర్వాన్ కామాంశ్చ దేహిమే.

దీప దేవతాభ్యో నమః అని దీపమును పుష్పాదులతో నర్చింపవలయును. తదుపరి పుష్పములు తీసుకొని మ్రొక్కుచూ శ్రీ మంగళ గౌరిని ధ్యానించవలెను.

## ధ్యానము

శ్లో॥ సకుంకుమవిలేపనామళిక చుంబికస్తూరికాం
సమందహసితేక్షణాం సశరచాపపాశాంకుశామ్
అశేషజనమోహినీమరుణమాల్య భూషాంబరాం
జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరేదంబికామ్

అని శ్రీ మంగళగౌరీ దేవతను ధ్యానించి పుష్పాంజలి నీయవలయును.

## ఆవాహనం

శ్లో॥ ఏణాంకానలభానుమండల లసచ్ఛ్రీ చక్రమధ్యేస్థితాం
బాలార్కద్యుతిభాసురాం కరతలైః పాశాంకుశౌ విభ్రతీమ్,

శ్రీ మంగళగౌరీ దేవతాయై నమః ఆవాహనం సమర్పయామి పుష్పములు వేయవలెను

## ఆసనం

శ్లో॥ కల్లోలోల్లసితామృతాబ్ధిలహరీమధ్యే విరాజన్మణి
ద్వీపే కల్పకవాటికాపరివృతే కాదంబవాట్యుజ్జ్వలే
రత్న స్తంభసహస్రనిర్మితసభామధ్యే విమానోత్తమే
చింతారత్న వినిర్మితం జనని తే సింహాసనం భావయే

శ్రీమంగళగౌరీదేవతాయై నమః నవరత్నఖచిత సింహాసనం సమర్పయామి.

## పాద్యం

శ్లో॥ ఈశానాదిపదం శివైకఫలదం రత్నాసనం తే శుభం
పాద్యం కుంకుమచందనాదిభరితం చార్ఘ్యం సరత్నాక్షతైః
శ్రీ మంగళగౌరీదేవతాయై నమః పాదయోః పాద్యం సమర్పయామి.

జలమును పుష్పములతో జల్లవలెను.

## అర్ఘ్యం

శ్లో॥ కాంసోస్మితాం హిరణ్యప్రాకారామార్ద్రాం జ్వలంతీం
తృప్తాం తర్పయంతీం పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియం
శ్రీ మంగళ గౌరీ దేవతాయై నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి

జలమును పుష్పములతో జల్లవలెను.

## ఆచమనీయం

శ్లో॥ చంద్రాం ప్రభాసం యశసాజ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టాముదారాం
తాం పద్మినీ మీంశరణహం ప్రపద్యే అలక్ష్మీర్మేణ శ్యతాం త్వాంవృణే
శ్రీ మంగళగౌరీ దేవతాయై నమః ముఖే ఆచమనీయం సమర్పయామి.

పుష్పములతో అలంకరించవలెను.

## మధుపర్కం

శ్లో॥ స్వర్ణపాత్రై స్సమానీతం దధిఖండ మధుప్లుతం
మధుపర్కం గ్రహాణేదం మయాదత్తం సురేశ్వరీ
శ్రీ మంగ్గళగౌరీ దేవతాయై నమః మధుపర్కం సమర్పయామి.

మధుపర్కం సమర్పించవలెను.

## పంచామృతస్నానం

శ్లో॥ గో క్షీరై రపి నారికేళసలిలైః శుద్ధోదకైర్మంత్రితైః,
స్నానం దేవి ధియా మయైతదఖిలం సంతుష్టయే కల్పతామ్.
శ్రీ మంగళగౌరీ దేవతాయై నమః పంచామృత స్నానం సమర్పయామి.

## వస్త్రయుగ్మం

శ్లో॥ హ్రీంకారాంకితమంత్రలక్షితతనో హేమాచలాత్సంచితైః
రత్నైరుజ్జ్వలముత్తరీయసహితం కౌసుంభవర్ణాంశుకమ్,

శ్రీ మంగళగౌరీ దేవతాయై నమః కంచుకసహిత కౌసుంభవస్త్రయుగ్మం సమర్పయామి.
వస్త్రము, (జాకెట్టుముక్క), ఉత్తరీయము, పుష్పములు మొదలగునవి సమర్పించవలెను.

## చందనం

శ్లో॥ సర్వాంగే ఘనసారకుంకుమఘన శ్రీ గంధపంకాంకితం
కస్తూరీతిలకం చ ఫాలఫలకే గోరోచనాపత్రకమ్,
శ్రీ మంగళగౌరీ దేవతాయై నమః దివ్య శ్రీ చందనం సమర్పయామి.

## అక్షతాన్

శ్లో॥ అక్షతాన్ శుభవర్ణాభాన్ హరిద్రాద్యైస్సుసంయుతాన్
కాత్యాయినీ గృహాణత్వం సర్వదేవ నమస్కృతే
శ్రీ మంగళగౌరీ దేవతాయై నమః హరిద్రాక్షతాన్ సమర్పయామి

## ఆభరణం

శ్లో॥ హంసౌరవ్యతిలోభనీయగమనే హారావళీముజ్జ్వలాం
హిందోళద్యుతి హేమపూరితతరే హేమాంగదే కంకణే
మంజీరౌ మణికుండలౌ మకుటమప్యర్థేందుచూడామణిం
నాసామౌక్తికమంగుళీయకటకౌ కాంచీమపి స్వీకురు
శ్రీ మంగళగౌరీ దేవతాయై నమః నవరత్నమయా భరణాని సమర్పయామి.

## పుష్పం

శ్లో॥ కల్హారోత్పలమల్లికామరువకైః సౌవర్ణపంకేరు హైః
జాతీచంపకమలతీవకుళకైః మందారకుందాదిభీః
కేతక్యా కరవీరకైః బహువిధైః కప్త్వాస్రజో మాలికాః
సంకల్పేన సమర్పయామి వరదే సంతుష్టయే కల్పతామ్

అని పుష్పమాలలు సమర్పించి పుష్పములతో ఈనామములతోపూజించవలయును.

## అథాంగపూజ

| | |
|---|---|
| ఉమాయై నమః | పాదౌ పూజయామి, |
| గౌర్యై నమః | జంఘే పూజయామి. |
| పార్వత్యై నమః | జానునీ పూజయామి, |
| జగన్మాత్రే నమః | ఊరూ పూజయామి |
| జగత్ప్రతిష్ఠాయై నమః | కటిం పూజయామి |
| మూల ప్రకృత్యై నమః | నాభిం పూజయామి |
| అంబికాయై నమః | ఉదరం పూజయామి |
| అన్నపూర్ణాయై నమః | స్తనౌ పూజయామి |
| శివసుందర్యై నమః | వక్షః పూజయామి |
| మహాబలాయై నమః | బాహూన్పూజయామి |
| వరప్రదాయై నమః | హస్తాన్ పూజయామి |
| కంబుకంఠ్యై నమః | కంఠం పూజయామి |
| బ్రహ్మవిద్యాయై నమః | జిహ్వాం పూజయామి |
| శాంకర్యై నమః | ముఖం పూజయామి, |
| శివాయై నమః | నేత్రే పూజయామి, |
| రుద్రాణ్యై నమః | కర్ణౌ పూజయామి |
| సర్వ మంగళాయై నమః | లలాటం పూజయామి |
| సర్వేశ్వర్యైనమః | శిరః పూజయామి, |
| మంగళగౌర్యై నమః | సర్వాణ్యంగాని పూజయామి |

## శ్రీ మంగళ గౌరి అష్టోత్తర శతనామావళి

ఓంగౌర్యైనమః
ఓంగణేశజనన్యైనమః
ఓంగుహాంబికాయైనమః
ఓంజగన్నేత్రేనమః
ఓంగిరిజాతనూభవాయైనమః
ఓంవీరభద్రప్రసువేనమః
ఓంవిశ్వవ్యాపిన్యైనమః
ఓంవిశ్వరూపిణ్యైనమః
ఓంఅష్టమూర్త్యాత్మికాయైనమః
ఓంఅష్టదారిద్ర్యశమన్యైనమః 10
ఓంశివాయైనమః
ఓంశాంభవ్యైనమః
ఓంశాంకర్యైనమః
ఓంబాలాయైనమః
ఓంభవాన్యైనమః
ఓంహైమవత్యైనమః
ఓంపార్వత్యైనమః
ఓంపాపనాశిన్యైనమః
ఓంనారాయణాంశజాయైనమః
ఓంనిత్యాయైనమః 20
ఓంనిర్మలాయైనమః

ఓంఅంబికాయైనమః
ఓంహిమాద్రిజాయైనమః
ఓంవేదాంతలక్షణాయైనమః
ఓంకర్మబ్రహ్మాయైనమః
ఓంగంగాధరకుటుంబిన్యైనమః
ఓంమృడాన్యైనమః
ఓంమునిసంసేవ్యాయైనమః
ఓంమాలిన్యైనమః
ఓంమేనకాత్మజాయైనమః 30
ఓంకుమార్యైనమః
ఓంకన్యకాయైనమః
ఓందుర్గాయైనమః
ఓంకలిదోషవిఘాతిన్యైనమః
ఓంకాత్యాయిన్యైనమః
ఓంభద్రదాయిన్యైనమః
ఓంమాంగల్యదాయిన్యైనమః
ఓంసర్వమంగళాయైనమః
ఓంమంజుభాషిణ్యైనమః
ఓంమహేశ్వర్యైనమః 40
ఓంమహామాయాయైనమః
ఓంమంత్రారాధ్యాయైనమః
ఓంమహాబలాయైనమః
ఓంసత్యైనమః
ఓంసర్వమయ్యైనమః
ఓంసౌభాగ్యదాయైనమః
ఓంకామకలనాయైనమః
ఓంకాంక్షితార్థప్రదాయైనమః
ఓంచంద్రార్కాయుతతాటంకాయైనమః
ఓంచిదంబరశరీరిణ్యైనమః 50
ఓంచక్రవాసిన్యైనమః
ఓందేవ్యైనమః
ఓంకామేశ్వరపత్న్యైనమః
ఓంకమలాయైనమః
ఓంమురారిప్రియార్ధాంగైనమః
ఓంపుత్రపౌత్రవరప్రదాయైనమః
ఓంపుణ్యాయైనమః
ఓంకృపాపూర్ణాయైనమః
ఓంకల్యాణ్యైనమః
ఓంకమలాయైనమః 60
ఓంఅచింతాయైనమః
ఓంత్రిపురాయైనమః
ఓంత్రిగుణాంబికాయైనమః
ఓంపురుషార్థప్రదాయైనమః
ఓంసత్యధర్మరతాయైనమః
ఓంసర్వసాక్షిణ్యైనమః
ఓంశశాంకరూపిణ్యైనమః
ఓంసరస్వత్యైనమః
ఓంనిత్యాయైనమః
ఓంస్వాహాయైనమః 70
ఓంస్వధాయైనమః
ఓంప్రత్యంగిరాంబికాయైనమః
ఓంఆర్యాయైనమః
ఓందాక్షాయిణ్యైనమః
ఓందీక్షాయైనమః
ఓంసర్వవస్తూత్తమోత్తమ్యైనమః
ఓంశివనాభినామధేయాయైనమః
ఓంశ్రీవిద్యాయైనమః
ఓంప్రణవార్థస్వరూపిణ్యైనమః
ఓంహ్రీంకార్యైనమః 80
ఓంనాదరూపాయైనమః
ఓంసుందర్యైనమః
ఓంషోడశాక్షరదేవతాయైనమః
ఓంమహాగౌర్యైనమః
ఓంశ్యామలాయైనమః
ఓంచండ్యైనమః
ఓంభగమాలిన్యైనమః
ఓంభగళాయైనమః
ఓంమాతృకాయైనమః
ఓంశూలిన్యైనమః 90
ఓంఅమలాయైనమః
ఓంఅన్నపూర్ణాయైనమః
ఓంఅఖిలాగమసంస్తుతాయైనమః
ఓంఅంబాయైనమః
ఓంభానుకోటిసముద్యతాయైనమః
ఓంవరాయైనమః
ఓంశీతాంశుకృతశేఖరాయైనమః
ఓంసర్వకాలసుమంగళ్యైనమః
ఓంసోమశేఖర్యైనమః 99
ఓంఅనురసంసేవ్యాయైనమః
ఓంఅమరైశ్వర్యైనమః
ఓంసుఖసచ్చిత్సుధారసాయైనమః
ఓంబాల్యారాధితభూతధాయైనమః
ఓంహిరణ్యాయైనమః
ఓంసూక్ష్మాయైనమః
ఓంహరిద్రాకుంకుమారాధ్యాయైనమః
ఓంసర్వభోగప్రదాయైనమః
ఓంమార్కండేయవరప్రదాయైనమః

**శ్రీమంగళగౌరి దేవతాయై నమః నానావిధ పరిమళ పత్ర పుష్ప హరిద్రకుంకుమ పూజాం సమర్పయామి.**

## ధూపం

శ్లో॥ తానీమాని తవాంబ కోమలత రాణ్యామోదలీలాగృహా
ణ్యామోదాయదశాంగగుగ్గులుఘృతైర్ధూపైరహంధూపయే

శ్రీ మంగళగౌరీ దేవతాయై నమః ధూపమాఘ్రాపయామి ధూపమును వేయవలయును

## దీపం

శ్లో॥ లక్ష్మీముజ్జ్వలయామి రత్ననివహైర్భాస్వత్తరే మందిరే
మాలారత్న నిడంబితైర్మణిమయ స్తంభేషు సంభావితైః

శ్రీ మంగళగౌరీదేవతాయై నమః దీపం దర్శయామి. అని దీపమునకు నమస్కరించవలెను

## నైవేద్యం

శ్లో॥ హ్రీంకారేశ్వరి తప్తహాటకకృతైః స్థాలీసహస్రైర్భృతం
దివ్యాన్నం ఘృతసూపశాకభరితం చిత్రాన్న భేదం తథా,
దుగ్ధాన్నం మధుశర్క రాదధియుతం మాణిక్యపాత్రే స్థితం
మాషాపూపసహస్రమంబ సఫలం. నైవేద్యమావేదయే.

శ్రీ మంగళగౌరీదేవతాయై నమః మహానైవేద్యం సమర్పయామి.

నైవేద్యములకు వండిన పదార్థములపై కలశోదకములను జల్లి, అమృతమస్తు అని పుష్పముతో కలశోదకమును పదార్థములయందుంచి అమృత పస్తరణమసి అని పుష్పముతో కలశోదకమును గౌరీదేవికిసమర్పించవలెను.

ప్రాణాయస్వాహా, అపానాయస్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయస్వాహా, సమానాయస్వాహా, అని కుడిచేతిలో పుష్పముంచుకొని శ్రీ మంగళగౌరీదేవికి నైవేద్య సమర్పణము చేయవలయును.

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, అమృతాపిధానమసి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌప్రక్షాళయామి, పాదౌప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.

అని అయిదు పర్యాయములు పుష్పముతోనుదకమునుంచవలయును.

## తాంబూలం

శ్లో॥ సచ్ఛాయైర్వరకేతకీదళరుచా తాంబూవల్లీదలైః
పూగైర్భూరిగుణైస్సుగంధిమధురైః కర్పూరఖండోజ్జ్వలైః
ముక్తాచూర్ణ విరాజితైర్బహువిధైర్వక్త్రాంబుజామోదకైః
పూర్ణారత్నకళాచికా తవ ముదే వ్యస్తా పురస్తాదుమే.

శ్రీ మంగళగౌరిదేవతాయై నమః ముఖమండనార్థం తాంబూలం సమర్పయామి.

# మంగళహారతి (నీరాజనం)

మంగళగౌరికి మంగళ మివ్వరే

గంగాధరుని రాణి గౌరికి మంగళ గౌరికి మంగళమివ్వరే

అష్టహస్తములతో అవతరించిన

దుష్టసంహారిణికి తుహినగిరిజకిపుడు

మంగళగౌరికి మంగళమివ్వరే

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్ధసాధికే

శరణ్యే త్ర్యంబకే దేవి గౌరీ నమోస్తుతే

శ్రీ మంగళగౌరీదేవతాయై నమః ఆనందనీరాజనం సమర్పయామి అని కర్పురహారతినిచ్చుచు పాట బాడవలయును.

# మంత్రపుష్పం

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్ధసాధికే,

శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే

శ్రీ మంగళ గౌరీదేవతాయై నమః సువర్ణ దివ్య మంత్రపుష్పం సమర్పయామి.

# ఉపచారములు

శ్రీ మంగళగౌరీదేవతాయైనమః

ఛత్రంసమర్పయామి అనిపుష్పములుంచవలయును.

శ్రీ మంగళగౌరీదేవతాయైనమః

చామరైర్వీజయామి అని చామరముతో వీచవలెను.

శ్రీ మంగళగౌరీదేవతాయైనమః

గీతం శ్రావయామి అనిమధురముగాపాడవలెను.

శ్రీ మంగళగౌరీదేవతాయైనమః

నానావిధరాజోపచారభక్త్యోపచారాన్ సమర్పయామి

అని అక్షతలు పుష్పములు ఉంచవలయును.

## ప్రదక్షిణ నమస్కారం

శ్లో॥ యాని కానిచ పాపాని జన్మాంతర కృతానిచ,
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః
త్రాహిమాం కృపయాదేవీ శరణాగత వత్సల
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్ కారుణ్య భావేన శ్రీ గౌరీ రక్షమాం సదా

అని మూడుసార్లు ప్రదక్షిణ చేసి శ్రీ మంగళగౌరీ దేవీకి నమస్కరించవలయును.

## క్షమాపణం

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరి
తత్సర్వం క్షమ్యతాం దేవి కాత్యాయని నమోస్తుతే

సర్వం శ్రీ మంగళగౌరీదేవతార్పణమస్తు అనయా మయాకృతయా పూజయా శ్రీ మంగళగౌరీ దేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు

అని జలముతో అక్షతలు వదలవలయును.

## వాయనం

అనంతరము సెనగలు, బెల్లము, క్రొత్తరవిక, ఫలములు, పుష్పములు, దక్షిణలు మొదలగు ద్రవ్యములతో నింపిన వెదురుపాత్ర నొకదానిని బ్రాహ్మణునకు వాయన మీయవలయును. శ్రీ మంగళగౌరీ దేవతకు నివేదించిన సెనగలు మొదలగు మంగళద్రవ్యములను

శ్లో॥ కాత్యాయినీ శివా గౌరీ సావిత్రీ సర్వమంగళా
సువాసినీభ్యో దాస్యామి వాయనాని ప్రసీదతు.

అని పఠించుచు సువాసినీ స్త్రీలకును, తన తల్లికిని వాయనముల నీయవలయును.

దేవీ ప్రసాదమగు పుష్పమును శిరస్సున, కుంకుమనునుదుటను, కాటుక కండ్లను ధరించి 16 వత్తులువేసి ఆవునేతితో దీపములను వెలిగించి, కథాశ్రవణ మును జేయుచు, సువాసినీ స్త్రీలకు మృష్టాన్నమిచ్చి తృప్తిపరుపవలయును.

## పూజావిధానము సంపూర్ణము

# శ్రీ మంగళ గౌరీ దేవి వ్రత కథ

పూర్వము పౌరాణికప్రవక్తయు, పురాణకథలను చెప్పుటలో మేటి యైన, సూతమహర్షులవారు శౌనకాదిమునుల అభ్యర్ధనపై దివ్యంగా, మంగళగౌరిదేవి మహాత్మ్యాన్ని చెప్పారు. దానిని నారదుడు సావిత్రీ ప్రతివ్రతామ తల్లికి ఉపదేశించాడు. దానినే శ్రీకృష్ణపరమాత్మ ద్రౌపదికి మంగళగౌరివ్రత విధివిధానాన్ని మహాత్మ్యాన్ని ఈ విధంగా ఉపదేశించసాగాడు.

"ద్రౌపదీ ! భూలోకమందలి సమస్త స్త్రీలు పాటించదగు వ్రతమే మంగళ గౌరివ్రతము. ఈ మంగళగౌరివ్రతము అత్యంతపవిత్రమైన, పుణ్యప్రదమైన వ్రతము మరియు స్త్రీలసౌభాగ్యసంపదలనుకాపాడే పుణ్యవ్రతము. దీనివిశిష్టతనువినుము.

మున్ను మనువనబడే మహీంద్రుడు ఈ మంగళగౌరివ్రతాన్నాచ రించుట వల్లనే చిరకాలం రాజ్యమేలగలిగాడు. మంగళగౌరీవ్రతాన్ని ఆచరించి నందువల్లనే పరమేశ్వరుడు, త్రిపురాసుర సంగ్రామంలో విజయాన్నందుకొన్నాడు, మంగళగౌరీ వ్రతమహాత్మ్యం వల్లనే కుజుడు మంగళవారానికి అధిపతి అయ్యాడు.

మంగళగౌరిదేవి ముఖ్యంగా అవునేతితో జ్వలించు జ్యోతియందును, పసుపు, కుంకుమలు, సుగంధద్రవ్యాలు, పండ్లు, పూలు, మున్నగు మంగళప్రదమైన ద్రవ్యములందును [redacted] ఉండును. అందుకే శుభప్రదమైన వస్తువులను వట్టినేలపై పెట్టరాదని పెద్దలంటూ ఉంటారు. ఈ మంగళగౌరి వ్రతాన్ని శుచి శుభ్రతలతో నియమనిష్టలతో, భక్తిశ్రద్ధలతో ఆచరించిన వారిని ఆ గౌరిదేవి సమస్తసౌభాగ్యసిరిసంపదలతో దీవిస్తుంది[redacted] ఏమాత్రం సందేహం లేదు. కావున ద్రౌపదీ ! ఎవరైతే శ్రావణమాసం మంగళవారంనాడీ వ్రతాన్ని ఆచరిస్తారో వారు ఆయురారోగ్యఐశ్వర్య సిరిసంపదలతో సౌభాగ్యంతోవర్ధిల్లగలరని పురాణాలు చెప్తున్నాయి.

పూర్వము మహిష్మతీ నగరాన్ని జయపాలుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. ప్రజలను కన్నబిడ్డలవలెచూసుకొని పాలించే ఆ ప్రభువుకు సంతానం మాత్రం కలుగలేదు. సంతానలేమితో ఆ దంపతులు సదా కుమిలిపోతూ ఉండే

వారు. సంతానంలేని స్త్రీని గొడ్రాలు అంటారు కదా ! అందుచే ఆ దంపతులుతీవ్ర మనోవేదనకు గురయ్యేవారు. వారు మ్రొక్కిన మ్రొక్కులకు కొదువలేదు. దర్శించని పుణ్యక్షేత్రాలు లేవు. వారి పూజలు, పునస్కారాలు, అన్నీ వ్యర్థమవసాగాయి. పుత్రప్రాప్తిమాత్రం కలుగలేదు.

సంతానలేమితో నిరంతరం నిత్యవేదనను అనుభవిస్తున్న ఆ దంపతులపై పరమేశ్వరుడు జాలిగొని, వారిని కరుణిద్దామని తలంచి జంగమవేషధారియై అంతఃపురం ముంగిట నిలిచి "భవతీ భిక్షాందేహి." అని అరవటం, జయపాలుని భార్య భిక్షతీసుకువచ్చేలోపు వెళ్ళి పోవటం చేసేవాడు తెచ్చినభిక్షతో జయపాలుని భార్య నిరాశగా వెనుదిరిగిపోయేది.

ఒకనాడు జయపాలునిభార్య జంగమేశ్వరునికి ఎలాగైనా భిక్షవేయాలనే పట్టుదలతో అతనికంటేముందు భిక్షతోవచ్చి వేచిచూడసాగింది. ఇంతలో జంగమేశ్వరుడు వచ్చి "భవతీ భిక్షాందేహి" యని వెళ్ళిపోసాగాడువెంటనే రాజపత్ని భిక్షవేయబోయింది.కాని జంగమేశ్వరుడందులకు సమ్మతించలేదు "తల్లీ ! సంతాన హీనుల భిక్షను గ్రహించము. సంతానహీనులు భిక్షను వేయటానికి అనర్హులు. కావున మేము మీరిచ్చే భిక్షను గ్రహించమని" చెప్పాడు.

అంతట రాజపత్ని "జంగమేశ్వరా మా ప్రారబ్ధంవలన మేము సంతాన హీనులమైతిమి. మేముచేసిన పూజలు పునస్కారాలు అన్ని వ్యర్థమవుతున్నాయి. మీరైనా,మేముసంతానవంతులమయ్యే ఉపాయాన్నిసూచించండి" అని వేడుకొన్నది.

సాధ్వీమతల్లీ ! జాగ్రత్తగా విను, రేపుఉదయం నీభర్తను శుచిగా, శుభ్రంగా నీలి పట్టుపీతాంబరములు ధరించి, నీలవర్ణపు అశ్వముపై తూర్పుదిక్కుగా వెళ్ళమని చెప్పు ఆ అశ్వము వాయువేగ, మనోవేగాలతో పోయి అలసి హఠాత్తుగా ఒకచోట నిలిచిపోతుంది. అక్కడ దిగి జాగ్రత్తగా అన్వేషించగా భూమిలో ఒక ఆలయం కనబడుతుంది. అది సాక్షాత్తు పరమేశ్వరియైన మంగళగౌరి ఆలయం. దానిని శుభ్రపరిచి, అందున్న అమ్మవారిని ఆరాధించమను. ఆ మంగళగౌరి మిమ్ములను తప్పక కరుణించగలదు. ఆమె దయా దాక్షిణ్యాలవలన మీకు పుత్రప్రాప్తి కలుగ గలదు." అని చెప్పి జంగమరూపధారియైన జగదీశ్వరుడు అంతర్ధానమయ్యాడు.

జయపాలునిభార్య విషయమంతా భర్తకు విన్నవించింది. అంతట జయపాలుడు నీలివస్త్రధారియై, నీలిపట్టుపీతాంబరములు ధరించి ఆ సన్యాసి చెప్పిన ప్రకారం నీలాశ్వముపై తూర్పుదిక్కుగా పయనించి అశ్వమాగినచోటదిగాడు. కొంతసేపు అన్వేషించగా ఆ భూమీశునికి భూమిలో బంగారుదేవాలయం కన్పించింది. మంగళప్రదమైన ఆ మణిమయబంగారు ఆలయంలో మంగళగౌరి దేవి విగ్రహం కన్పించింది. అత్యంత భక్తిశ్రద్ధలతో, నియమనిష్టలతో మంగళ గౌరి దేవిని పూజించాడు మూడురోజులు ఏకాగ్రచిత్తంతో మంగళగౌరిని ఆరాధించగా గౌరిదేవి ప్రత్యక్షమైంది.

"జయపాలా ! నీ భక్తి శ్రద్ధలు నన్ను ముగ్ధురాలిని గావించాయి. అత్యంత సంతుష్టిరాలినయ్యాను. నీకు వైధవ్యముగల కుమార్తె కావలెనా ? లేక అల్పాయుష్కుడైన కుమారుఢు కావలెనా కోరుకొనుము, నీ ప్రారబ్ధకర్మననుసరించి నేనిట్లు వరమీయవలసి వచ్చింది. కావున నీ అభీష్టాన్ని తెలియజెయ్యి" అని ఆజ్ఞాపించింది. అంతట దీర్ఘాలోచనచేసిన జయపాలుడు, తనకుకుమారుడేకావలెనని కోరుకున్నాడు.

అంతట దేవి "జయపాలా ! ఆ కనిపిస్తున్న చెట్టుకాయను అచ్చటనున్న గణపతిబొడ్డున కాలుమోపి, ఒక కాయను కోసుకొనివెళ్ళి నీ భార్యకిచ్చి తినమని చెప్పు, అనతికాలంలోనే ఆమె గర్భవతియై పండంటిబిడ్డను ప్రసవించగలదు." అని చెప్పి అంతర్ధానమయింది.

అత్యాశాపరుడైన ఆ జయపాలుడట్లేయని గణపతిబొడ్డుపై కాలుమోపి, అత్యాశతో తనకందిన కాయలన్నింటిని కోసుకొన్నాడు. కాని విచిత్రం, అంతా దైవలీలఅన్నట్లు అతడు క్రిందికిదిగి చూడగా ఒక్కకాయ మాత్రమే మిగిలి ఉంది. జయపాలుడు చేసిన తప్పిదానికి, వాని అత్యాశకు ఆ గణపతి కోపించి "రాజా! అమ్మ ఒక్క కాయనే కోసుకొనమంది. కాని నీవు దురాశకుపోయి కాయలన్నింటిని కోసి వృధాచేశావు. అందుకు ఫలితంగా నీ కుమారుడు తన పదహారవ యేటనే పాముకాటుచే మరణిస్తాడు" అని శపించాడు. జయపాలునిదురాశ దుఃఖాన్ని చేటును మిగిల్చింది. బాధాతప్తహృదయుడై తనుచేసిన తప్పిదానికి చింతిస్తూ ఇంటిదారిపట్టాడు.

అనతికాలంలో జయపాలునికి మగబిడ్డ జన్మించాడు పదహారుకళలతో అత్యంత అపురూపసౌందర్యుడైన ఆతడు క్రమంగా పెరిగిపెద్దవాడయ్యాడు. కుమారుడు యుక్తవయస్కుడయ్యేసరికి ఆతనికి పెండ్లిచేయాలనే తలంపుతో రాణి, జయపాలునితో"నాథా! మన కుమారునికి పెండ్లివయస్సువచ్చింది. ఆతనికి చక్కనిచుక్కనుతెచ్చి పెండ్లి చేయాలి." అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. అంతట జయపాలుడు దేవీ ! మన కులాచారముప్రకారము కుమారుడు కాశీకి పోయి రావలెను గదా ! కావున ఆతడు కాశీకి పోయి మృత్యుంజయున్ని సేవించి తిరిగివచ్చినతర్వాత చేద్దాం" అన్నాడు.

ఒక మంచిరోజున పిల్లవానిమేనమామను తోడిచ్చి కుమారుడ్ని కాశీపంపించారు. అల్లుడు, మేనమామ మార్గమధ్యంలో ఒక రాజుగారి ఉద్యాన వనంలో విశ్రాంతి తీసుకొన్నారు. ఆ తోటలో ఆ దేశయువరాణి, తన చెలికత్తెలతో విహారానికి వచ్చింది. ఉద్యానవనంలో ఆటలాడుకుంటున్న యువరాణికి, చెలికత్తెలకు జగడమొచ్చి వాగ్వివాదానికి దిగారు. ఇంతలో ఒక చెలికత్తె రాకు మార్తెను "రంఘా ముంఘా" అనితిట్టింది. రాకుమార్తె వారితో "నన్ను రంఘా-ముంఘా అని తిట్టకండి మా అమ్మ మంగళగౌరి వ్రతాన్ని నోచుకున్నది. నాకు వాయన మివ్వనున్నది. నాచే కూడా వ్రతాన్ని చేయిస్తుంది. మా యింట రంఘలూ, ముండలూ ఎవరూ లేరు మీరు నన్ను తిట్టడం భావ్యంకాదు" అన్నది.

ఆ మాటలు విన్న పిల్లవాని మేనమామ, ఎలాగైనాసరే ఈ రాకుమార్తెతో తన మేనల్లుడికి వివాహం చేయించదలచాడు. కారణం ఆ యువరాణి మంగళగౌరి వ్రతం చేయబోతోంది. మంగళగౌరీవ్రతం చేసేవారు సౌభాగ్య సంపదలతో వర్ధిల్లుతారుగదా! ఆ విధంగా మేనల్లుడు దీర్ఘాయుష్మంతుడు కాగలడనుకొన్నాడు.

అక్కడే ఉద్యానవనంలోవున్న అమ్మవారిగుడిలో పూజలు చేస్తున్న యువరాణి తండ్రియైన మహారాజును చాటునుండి గమనించాడు. రాజు పూజ చేస్తూ అమ్మవారితో "తల్లీ ! నిన్నే నమ్ముకుని నా కుమార్తెకు వివాహం తలపెట్టాను బంధువులందరూ వచ్చారు. కాలం సమీపించింది. ఇప్పుడేమో మగపెండ్లివారు రాలేమని కబురుపంపారు. ఇపుడు నేనేంచేయాలి ? నా పరువు మర్యాదలేం గాను?" అని చెపుకొని విలపించసాగాడు.

ఇదంతా విగ్రహం వెనుకనుండి గమనిస్తున్న మేనమామ "రాజా! దిగులు పడకు. క్షయవ్యాధిగ్రస్తునితో నీ కుమార్తెకు పెండ్లి చేయాలనుకున్నావు. అందుచేతనే పెండ్లివారు రాలేమని కబురుపంపారు. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు ఇదంతా దైవసంకల్పం. ఈ ఉద్యానవనమందే నీ కుమార్తెకు తగిన వరుడున్నాడు. అతని పేరు శివయ్య. వరప్రసాదంవల్ల జన్మించాడు. ఆతడు సద్గుణాల సంపన్నుడు. కావున నీ కుమార్తెనాతనికిచ్చి వివాహం జరిపించు. అంతా సవ్యంగా జరుగు తుంది." అనిపలికాడు. అమ్మవారే యిట్లు ఆనతిచ్చారని భ్రమించిన రాజు, ఉద్యాన వనమంతా వెదికి శివయ్యను పట్టుకుని ఆతనిమేనమామతో మాట్లాడి, అత్యంత వైభవంగా వివాహం జరిపించాడు. మహారాజుకు దైవసంకల్పంవల్ల బంగారం లాంటి అల్లుడు దొరికాడు.

ఆ నాటిరాత్రి నవదంపతులిరువురునీ శోభనంగదిలోనికి పంపించారు. ఆనాటిరాత్రి వధువుకు కలలో మంగళగౌరి కనిపించి "వధూమణీ ! నీవు మంగళ గౌరీవ్రతం చేశావు. కావున నీకీ రహస్యం చెబుతున్నాను విను. నీ భర్తకు ఈ నాటి రాత్రితో ఆయుష్షు పరిసమాప్తం కాబోతున్నది. ఒక నల్లని త్రాచుపాము నీగదిలో ప్రవేశించి, నీ భర్తను కాటువేయడానికి వస్తుంది. నీవాసమయము వరకు నిరీక్షించి ఆనల్లత్రాచుకు ఎదురుగా ఒకపాలగిన్నెనుఉంచు, పాలుత్రాగటా నికై ఆ పాము అందులోనికి దూరుతుంది. వెంటనే నీవు ఒక పసుపుగుడ్డతో ఆ పాలపాత్రకు వాసినకట్టి అటకపైనుంచి మర్నాడు నీ తల్లికి వాయనముగానిమ్ము". అని చెప్పింది. ఆమె దేవి చెప్పినట్లేచేసింది.

అప్పటికే అర్ధరాత్రి దాటినందున, కళ్ళుతెరిచిచూసిన వధువుకు నల్లని నాగుపాము, భర్తపడుకున్నవైపు రావటం చూసింది. పాలగిన్నెను దానిముందుకు తోసింది. ఆ నల్లత్రాచు పాలు త్రాగుదామని పాత్రలో ప్రవేశించింది. అంతే ! యువరాణి ఒక పసుపుగుడ్డతో దానిమూతిని గట్టిగాబిగించి అటకపైఉంచింది. యధా ప్రకారం నిద్రపోయింది.

ఇక తెల్లవారుజామున నిద్రలేచిన శివయ్య చెబితే కాశీకి వెళ్ళనివ్వరని తలచి, ఎవ్వరితోనుచెప్పకుండా మేనమామతో కలిసి కాశీకి వెళ్ళిపోయాడు. కాని ఆతొందరలో తనఉంగరాన్ని ప్రక్కమీదనేఉంచి, మరిచిపోయాడు యువరాణికా

ఆ ఉంగరమే సాక్ష్యమయ్యింది. తెల్లవారిన తరువాత శివయ్య కనబడకపోతే తన భర్తురాలు అభాసుపాలవుతుందని గ్రహించిన సాక్షాత్తుపరమేశ్వరుడే శివయ్య రూపములో సంచరించసాగాడు. ఎవరికీ ఏ విధమైన అనుమానము కలుగలేదు.

గౌరిదేవి చెప్పినట్లు మర్నాడు ఆ పాత్రను తల్లికి వాయనముగా ఇచ్చింది. పాత్రను తెరిచిచూసిన తల్లికి అందు మంచిముత్యాలహారము ఉండుటను గమనించి మరల దానిని కూతురుమెడలో ఆభరణముగా వేసింది. అందంగా అలంకరించబడిన వధువును రెండవనాటి రాత్రి భర్తతోసహా గదిలోనికి పంపారు. అత్యంతభక్తిశ్రద్ధలతో, నియమనిష్టలతో మంగళగౌరివ్రతాన్నాచరించిన ఆ పతివ్రతా శిరోమణికి తన గదిలోనున్నవాడు అసలు భర్తకాడని వాదించింది. అచ్చెరువందిన అతివలందరూ ఆదుర్దాపడుతుండగా ఆ మాయావరుడంతర్ధానమయ్యాడు. యువరాణి సౌశీల్యాన్ని అందరూ మెచ్చుకున్నారు. ఉంగరం మరచిన అసలుభర్త తప్పకవస్తాడని, ఆతడువస్తే మనబసలోనే విడిది చేయాల్సిఉంటుందని, గ్రహించిన సౌశీల్యవతియైన యువరాణి, తమ విడిదిలోని బాటసారులందరకు తానే సేవలు చేయసాగింది.

ప్రతిదినము స్వయంగా బాటసారులకు పాదప్రక్షాళణసేవలు చేస్తున్నయువరాణికి ఒకనాడు శివయ్య, అతనిమేనమామ, కాశీనుండి తిరిగివస్తూ అక్కడే బసచేయటం, ఒక సువర్ణావకాశంగా దొరికింది. శివయ్యకు పాదప్రక్షాళనం చేస్తన్న యువరాణి, అతడే తన భర్తయని ఉంగరంసాక్ష్యంగా నిరూపించింది. శివయ్యకూడా నిజమని అంగీకరించాడు.

నవవధువుతోసహా, శివయ్య తననగరానికేగి తనతల్లిదండ్రులకు విషయ మంతా విన్నవించాడు. ఆయువుతీరిన శివయ్యకు మరల ఆయుష్షుఎట్లు వృద్ధి పొందిందని నవవధువునడిగాడు. తాను మంగళగౌరిదేవి వ్రతం చేయటంవల్లనే నాకీ మహాద్భాగ్యం కలిగిందని చెప్పి అత్తమామలకు పాదాభివందనం చేసింది. నాటినుండి మంగళగౌరివ్రతాన్ని క్రమం తప్పకచేస్తూ చిరకాలం వర్ధిల్లారు.

కావున ద్రౌపదీ ! మంగళగౌరీవ్రతంవల్ల, స్త్రీలసౌభాగ్యం నిలబడగలదు. నీవుకూడా ఈ వ్రతాన్నాచరించి తత్ఫలితాన్ని పొందవలసిందని " శ్రీకృష్ణుడు ద్రౌపదికి ఉపదేశించాడు. కాబట్టి "భక్త శిఖామణులారా ! మంగళగౌరీవ్రతాన్ని ఆచరించి మాంగల్యబలాన్ని పొందండి. చిరకాలం సిరిసంపదలతో వర్ధిల్లండి.

# వ్రత ఉద్యాపనము

మంగళవారపునోము పెండ్లిఅయిన సంవత్సరమునుండి వరుసగా 5 సం॥లు చేయాలి అయిదవసంవత్సరం పగలు గౌరీదేవిని యధావిధిగా పూజించి దంపతులిద్దరూ ఉపవాసం చేయాలి. రాత్రివేళ మంటపాన్ని, 19 కలశాల్ని ఉంచాలి. సమస్తదేవతలను బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, పార్వతీ, లక్ష్మి, సరస్వతులను, విఘ్నేశ్వరుని, సప్తమాతృకలను, సావిత్రిని, శచీపురందరులను, కుమార స్వామిని, నవగ్రహాలను పూజించాలి. శక్తిలేనివారు 5గాని 2గాని కలశాలుంచవలెను. భక్తిశ్రద్ధలతో నిష్టగా పూజగావించాలి.

మర్నాడు హోమాన్ని నిర్వర్తించాలి. బెల్లంజీలకర్ర, నెయ్యి పరమాన్నం రాగిసమిధలు, దూర్వాంకురాలతో హోమాన్ని చేయాలి. ఆరు వెదురు బుట్టలు మంగళద్రవ్యాలతో సువాసినీలకు వాయనదానములీయవలెను.

"సర్వమంగళ మాంగళ్యే" అనుమంత్రాన్నిజపించాలి. పిమ్మట దీపాలను పదహారింటిని వెలిగించవలెను. అతిధ అభ్యాగతులను, సువాసినీలను దంపతులను అందరికీ షడ్రసోపేతముగా విందులిచ్చి బ్రాహ్మణులకు దక్షిణ తాంబూలాది వగైరాలతో సంతుష్టులను గావించవలెను.

కధ - ఉద్యాపనా విధానం సంపూర్ణం

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్ధసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి గౌరీ నమోస్తుతే

# శ్రావణ మంగళవారము పాట

ఈశ్వరతనయునకు, పార్వతీపుత్రునకు గజాననునకు భక్తితోను,
విభవమునిచ్చే వైభవదాయిని వినుతింతునిన్ను వినయముగను
జయమంగళం నిత్య శుభ మంగళం
మహిమీద వెలసిన మంగళగౌరిని - మదిలోన కొలిచెద భక్తితోను
పుడమిపైనొకరాజు సంతానహీనుడై పత్నితోగూడి కుములుచుండె ॥జయ॥
పరమేశ్వరుడంత జాలినొంది - భూమీశుని బాపుదమంచు భువికిదిగివచ్చె

జంగమదేవరగా జగతికేతెంచి - భిక్షమడిగె యా భూపతిఇల్లాలిని ॥జయ॥
బంగారుపళ్ళెరముతో భూమీశుపత్ని - భిక్షతీసుకురాగ భవ్యుడపుడు
క్షణమైన నిలువక కోమలాంగిని కానక - చక చకా పోదొడంగె సాంబశివుడు ॥జయ॥
ఇదేమివింతయని ఇంతినివ్వెరపోయి - మరునాడు ముందుగామరలివచ్చి
వెనుకగా నిలబడి కాచుకొనియుండ - జగదీశుడేతెంచె జాగుసేయక
జంగమేశ్వరుని జూచి గట్టిగా పట్టుకొని - భిక్షగైకొనవెందుకనెను ॥జయ॥
పిల్లపాపలు లేని పడతి భిక్షను - గైకొనంగ రాదనంగ నా రాజపత్ని ॥జయ॥
మేమేమి చేయుదము మాకేదిగతియనుచు - సాష్టాంగ బడిరి సాంబశివుని చెంత
భూతనాధుని గూర్చి భూరితపమొనర్చు - బాగౌను నీ భవితయనె భవ్యుడపుడు ॥జయ॥
సంతానవాంఛతో సతీపతులపుడు వేవేగ వనములోనికిబోయి నిష్టగాను
తపమాచరింపగా తపోధనుడేతెంచి సంతసమున ప్రత్యక్షమయ్యెసర్వేశ్వరుండు
సతీపతులపుడు తమ సంతానేచ్ఛను సంతసించి , సాంబశివునికిచెప్పె ॥జయ॥
సర్వేశ్వరుడంత సంతసముచెంది - సతీపతులతో పలికె నిట్లు
కాంచుమోయమ్మ కాళికాగుడివెనుక - చూత వృక్షముపైన ఫలమున్నదొకటి
ఆ పండు తిన్నచో ఆకాంక్ష తీరునని, సాంబశివుడంత వెడలిపోయె ॥జయ॥
అంతటారాజు అత్యాశతో - వృక్షమందలి పండ్లన్నికోసి తెచ్చె
విప్పిచూడగా అందు ఫలమొక్కటేయుండె వింతగాను ॥జయ॥
అత్యాశకుపోయిన ఆ రాజునపుడు శపియించె గజాననుడపుడు
అల్పాయుష్కుడౌ తనయుడేప్రాప్తినీకని శపియించె పార్వతీతనయుడపుడు
చేసుకున్నవారికి చేసుకున్నంత ప్రాప్తియే గాని- రవ్వంత ఎక్కువైనరాదటంచు
ఆ పండు అరగించ అతివగర్భముదాల్చె అనతికాలములో ॥జయ॥
ఉన్నత తేజస్సుతో ఉధ్భవించిన సుతుని గాంచి ఉత్సాహముతో ఉప్పొంగెరాజు
శివయ్యాయని శివుని పేరునిపెట్టి సంతసమున వారు సంచరించసాగ ॥జయ॥
యువతులందరు గూడి యువరాజుకపుడు, ఉగ్గుపాలనుబోసి తిలకమునుదిద్ది
పెంచి పెద్దగజేసెపెంపుమీరగను, పెండ్లియీడుకువచ్చెనా తనికపుడు ॥జయ॥

కన్యనొకదానిని తెచ్చి కుమారునికపుడు - పెండ్లిచేసే నా రాజు వైభవముగ
నవదంపతులారాత్రి హాయిపొందేటి ఆ సమయమందు ॥జయ॥
గౌరిదేవి కా వధువు భక్తురాలగుటవలన - కలలోన కనిపించె కరుణించతలచి
తరుణీమణీ నీపతికి గండంబు వచ్చె - వేవేగలెమ్మని మేలు కొలిపె ॥జయ॥
మాంగళ్యవతియైన ఆ మహిళ యపుడు - మేలుకొనిజూచె మంచముక్రింద
కృష్ణసర్పమును జూచి, గౌరిదేవినితలంచి - క్షీరపాత్రను దెచ్చి యుంచె ॥జయ॥
కాంతభక్తికి మెచ్చి కాళసర్పమపుడు - కలశంబునందు దూరియుండ
వనితభక్తితో వందనంబులు చేసి - పాత్రమూతను బిగించి పైనపెట్టి ॥జయ॥
ఉషోదయమ్మున శివయ్య లేచి శివదర్శనానికైవెడలె కాశీపురికి
పత్ని శీలము పాడుబడునని తలంచి శివయ్య రూపుతో శయ్యనించె శివుడు॥జయ॥
పడతులందరు గూడి పెండ్లి వధువునులేపగా - ఆ రాకుమారిలేచెనంత
పక్కమీదున్న పరపురుషునిగాంచి తల్లడిల్లుచు నుండె తరుణి యపుడు॥జయ॥
నన్నాదరించుమో నా తండ్రి నా మాట వినుమనియె ఆ తరుణీమణి
నా భర్తకోసమై నేనొక్కవ్రతంబు చేయపూనుకొంటిననియె ॥జయ॥
బాటసారులకు భక్తితో సేవలుచేసి - తాంబూలమిత్తుననియె
అట్లు చేసినచో ఆ భర్తలభించునని - ఆత్మవిశ్వాసముతో ఆతరుణి యుండె ॥జయ॥
శివదర్శనార్థమై కాశికేగిన శివయ్య - గంగాస్నానముచేసి కాలభైరవునిగాంచి
కాశివిశ్వేశ్వరునికాంచి, అన్నపూర్ణనుగొల్చి భక్తిమీరగ ఒప్పుగాను ॥జయ॥
తీర్థయాత్రలుచేసి తిరువేణిదర్శించి తిరిపెమును తనివితీర దర్శించి
భక్తిశ్రద్ధలతో భగవంతునికొల్చి తిరగివచ్చి మామనగరు జొచ్చె ॥జయ॥
ఆసతి సల్పు అన్నదానము జూసి - స్వయంపాకముతో సంతృప్తిజెందె
అనంతరమా రాజపుత్రుడు అరుగుపై నిలుచుని యుండగా ॥జయ॥
తాంబూలమిచ్చిన తరుణీమణితో - మాకేల ఇదియనుచు త్రిప్పిపంపె
బాటసారులందరూ బాగుగా భుజియించి - తాంబూలమందుకొని సేవింపగా ॥జయ॥
మీరేల ఒల్లరని మహిళలందరుగూడి రాజభవనమునకూ గొనిపోయిరంత

నేనేమి చేసితి, నన్నేల నిల్పితిరి, నేచేసిన తప్పిదమేమనియె ॥జయ॥
పడతి వస్తున్నపతిని జూచి – మనముననెంతయో ముదము నొందె
భర్తకెదురేగి తాంబులమిచ్చి – ఈతడే నా భర్త అనియె నా ఇల్లాలు ॥జయ॥
విడివడిన వధూవరులు వేవేగమే గూడి ఆనందాబ్ధిలో ఓలలాడిరపుడు
నాపూజ నెరవేరి నాపతిని జేరితిని, నా తండ్రి ముద్దుపట్టియనైతిననియె ॥జయ॥
కారణమేమని ధరణీపతియడుగగా మామగారితో అల్లుడిట్లనియె
కాశికిబోవు కాంక్షతోబోయి విశ్వేశ్వరునిదర్శించి మరలివచ్చితిననెను ॥జయ॥
సౌశీల్యవతి శీలమును మెచ్చి సంతసించిరంత బంధువులందరు
శివయ్యతండ్రిని శీఘ్రముగ పిలిపించి విషయమంతయు విన్నవించె ॥జయ॥
గోదాన, భూదాన, స్వర్ణదానములన్నియు సంతృప్తిగ చేసి సంతసమందిరపుడు
ఘనమైన దానములగు అశ్వగజ, అన్నదానములు చేసిరీఘనతగాను ॥జయ॥
వధూవరులు ఆ రాత్రి తల్లిదండ్రుదులను తలచుకొనంగ
ముత్యాలపల్లకిలో ముద్దులకూతురు పచ్చలపల్లకీనిచ్చిపంపె ॥జయ॥
ఉన్నతమైన ఉత్తమాశ్వమునిచ్చి కూతుర్ని అల్లుడ్ని పంపెనపుడు
పత్నితోడ శివుడు తన సీమ చేరంగ ప్రజలెల్లపరమానందమొందిరి ॥జయ॥
అత్తమామలపుడు, కోడలిదరిచేరి ఆదరంబున పలికెనిట్లు
ఏ నోమునోచితివి, ఏ పూజచేసితివి, ఎటులనాపుత్రుని కాపాడితివి ॥జయ॥
నా బిడ్డ నాపట్టి అల్పాయుష్కుని ఎట్లు కడతేర్చితి వనియె
అంతనాకన్య అత్తమామలకు ప్రణమిల్లి – విన్నవించె వినయముతో నిట్లు ॥జయ॥
మంగళగౌరి మహిమగల తల్లిని, వైధవ్యమును బాపే వైభోగదాయిని
ప్రేమతో పూజించి, భక్తితోసేవించ ఆయమ్మ నన్ను కరుణించెననియె ॥జయ॥
అదివిన్న శివయ్యతల్లిదండ్రులు – కోడలిని కడుప్రేమతో చూసి
ఆయురారోగ్యములు సౌభాగ్యసిరిసంపదలతో తులతూగుమని దీవించిరపుడు
మంగళగౌరిని మదినిండ పూజించు – మగువలకుకలుగును మాంగల్యములు
మంగళగౌరినిభక్తితో సేవించి కోరిన కోరెలు తీరుకొనండి ముత్తైదువులారా ॥జయ॥

# శ్రావణ శుక్రవారము పాట

కైలాసగిరియందు కైలాసవాసిని కైలాసపతితో కొలువుండగ
ప్రమదాదిగణములు ప్రస్తుతింప పార్వతిఅడిగె భక్తితో పరమేశ్వరునియిట్లు
॥జయ మంగళం నిత్య శుభమంగళం॥
ఏ పూజ, ఏ వ్రతము, ఏ నోము భక్తులకు, సర్వసంపదలిచ్చి వంశాభివృద్ధి నొందించును.
అనుచు పార్వతి, పరమేశ్వరుని అడుగగా,అతడీరీతి అనియెనిట్లు ॥జయ॥
కుండిన నగరములో చారుమతి అనియేటి వనిత కలదు
పతివ్రతయైన చారుమతి అత్తమామలసేవ సదా చేయుచుండె ॥జయ॥
వరలక్ష్మి కరుణించి స్వప్నమున కనిపించి వనితను లెమ్మనియె
మీరెవ్వరమ్మాయని ముదముతో నలినాక్షి వందనముచేసె ॥జయ॥
వరలక్ష్మినే నేను వరములీయగ వచ్చితిని లే లెమ్మనె చారుమతిని
కొలిచినవారికి కోరినకోర్కెలు తీర్చేటితల్లినే వరలక్ష్మినే నేను ॥జయ॥
ఏ మాసమేపక్షమేవారమునాడు ఏ ప్రొద్దున
నీపూజనేనెట్లు చేయవలెనని చారుమతి అడిగె భక్తితో వరలక్ష్మిని ॥జయ॥
శ్రావణమాసాన శుక్లపక్షమునందు శుక్రవారపుసాయంత్రమందు
పంచకలశములలోననునిల్పి భక్తితో పూజించుమని చెప్పెను ॥జయ॥
మేల్కొన్నచారుమతి బంధుమిత్రులగూడి స్వప్నవృత్తాంతమును చెప్పెనంత
కాంతలారా ! నను కొల్వుడని శ్రీ మహాలక్ష్మి ముదముతో సెలవిచ్చెను ॥జయ॥
ఓయమ్మ ! మా యమ్మ ! చారుమతీ అమ్మ ! పూజెట్లు చేయవలెనమ్మా !
ఏమి మాసంబు ? ఏ పక్షంబు ? ఏ వారమునాడు ? ఏప్రొద్దున ॥జయ॥
శ్రావణమాసాన శుక్లపక్షమునందు శుక్రవారపు సాయంత్రమునా
పంచకలశములలో అమ్మను నిల్పి భక్తితో పూజించమని చెప్పెనూ ॥జయ॥
శ్రావణమాసాన భక్తిశ్రద్ధలతో పాటలుపాడుతూ నగరమునలంకరించి రవుడు
పచ్చపచ్చనితోరణాలతో, పలుపుష్పసంభారాలతో దివ్యకాంతులనీనసాగె ॥జయ॥

వరలక్ష్మినోము వనితలందరు గూడి పసుపు బట్టలు ధరించి పడతులందరు
పంచభక్ష్య పరమాన్నములతో పూర్ణకుడుములుతో నైవేద్యమునిడుతురపుడు ॥జయ॥
ఘనమైన పిండివంటలు దండీగా వండించి, ఘుమ ఘుమలతో కుడుములు, వడలు వడ్డింతురపుడు
దండిగా నిండుపళ్ళెములతో విధిగా నైవేద్యమిడుతురు. ఖర్జూరఫలములు ॥జయ॥
స్వచ్ఛమైన సలిలము స్వర్ణకలశాలతో నారాయణునకర్పింతురు నారుపోసి
తొమ్మిదిపోగుల తోరమొప్పగ పోసి వరలక్ష్మికర్పింతురు ముదముతోను ॥జయ॥
వేదపండితుడైన విప్రుని బిల్చి, గంధమాక్షతలతో పాదప్రక్షాళనము చేసి
నవగాయ పిండివంటలతో నయముగ బ్రాహ్మణునకు విందు చేయుదురు సంబ్రమముగాను ॥జయ॥

## మంగళహారతి

మంగళగౌరికి మంగళం, జయమంగళం, నిత్యశుభమంగళం
శ్రావణమంగళగౌరికి జయమంగళం నిత్య శుభమంగళం
పదునాల్గులోకాలనేలు మంగళగౌరికి జయమంగళం నిత్య శుభమంగళం
చల్లని చూపుతో చక్కగా దీవించు మంగళగౌరికి మంగళం ॥జయ॥
సిరులిచ్చి దీవించు సిరిగల తల్లికి నీరాజనం కర్పూర నీరాజనం
ముక్కోటి దేవతల ప్రతిరూపమైనట్టి మంగళగౌరికి ॥జయ॥
కోరిన కోర్కెలు తీర్చేటితల్లికి నీరాజనం కర్పూర నీరాజనం
సిరిసంపదలతో సౌభాగ్య సంపదలతో ముదముగా దీవించు మంగళగౌరికి
భక్తులను బ్రోచేటి మహిమగల తల్లికి మంగళగౌరికి ॥జయ॥
శ్రావణమాసాన, శ్రద్ధగా పూజించు మంగళ గౌరికి
కుండిన నగరాన చారుమతిని బ్రోచిన మంగళరూపిణికి ॥జయ॥
ముదముగా మహిళలను దీవించి కాపాడు మంగళగౌరికి
ముదితల ముప్పులను ముదముతో బ్రోచేటి మంగళగౌరికి ॥జయ॥
ఆయురారోగ్యములిచ్చి ఆదరముతో లాలించు ఆయమ్మ మంగళగౌరికి
మగువల మాంగళ్యములను మంచిగా కాపాడు మాయమ్మ మంగళగౌరికి ॥జయ॥
పదివేల దండాలు పడతిరోనీకు, కరుణించు కాపాడే మంగళగౌరికి
మంగళగౌరికి మంగళం, జయ మంగళం, నిత్య శుభమంగళం ॥జయ॥